స్త్రీ, గొల్లది, గోపస్త్రీ.
తే. వెన్నలను గోపికా చిత్తవృత్త
ములును,నరసి ప్రముచ్చిల నేర్చిన హరి
యితండె. ఉద్యో. 3.175.

**గోపుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
గోవులను రక్షించువాఁడు.
కం. మున్నుగల గోపవర్గము,నిన్నుం
గని కొలిచి భక్తి నీ పని సేయన్.
విరా. 1.288.

**గోపురము** సం. వి. అ. న.
పురద్వారము – గవను.
చం. హరితనయుండు పార్థుఁడు
ప్రియంబున సంచిత నాహవక్రియా,
విశతుం జేసి యప్పురము వీథుల
వేదుల రమ్యహర్మ్య గోపురముల...
కాంచనమయంబులఁ జేసె నీసునన్.
ఆది. 8.201; కర్ణ. 1. 263.

**గోప్రతారము** సం. వి. అ. న.
ఒకానొక పుణ్యతీర్థము. ఇది శ్రీరా
ముఁడు స్వర్గతుఁడైన సరయూప్రదేశ
మున నున్నది. ఇచ్చట స్నానము
చేసిన అశ్వమేధ ఫలము దక్కును.
ఆర. 2.273.

**గోభవనము** సం. వి. అ. న.
ఒకానొక పుణ్యతీర్థము. ఇచ్చట
స్నానము చేసిన గోసహస్ర సమృద్ధు
లగుదురు. ఆర. 2.263.

**గోమతి** సం. వి. ఈ. స్త్రీ.
1. ఒకానొక పుణ్యనది. ఇది నైమిశా
రణ్యమునఁ గలదు. శాంతి. 6.555.
దీని తీరములు దేవతలకు, ఋషులకు,
యజ్ఞభూములు. ఈ నదియందు
స్నానము చేసిన అశ్వమేధఫలము
దక్కును. ఆర. 2.273.
2. గోస్తోత్రము. దీనిని గోసమూహము
నడుమ నిలిచి జితేంద్రియుఁడై జపిం
చినఁ బవిత్రుఁడగును. అను. 3.49.

**గోమయము** సం. వి. అ. పుం. న.
1. ఆవుపేడ.
కం. .... గోమయయుత,వినుతాంబు
స్నానమతి పవిత్రం బనఘా. అను.
3.33.
2. ఎద్దుపేడ.
వ. అయ్యుదంకుండు ... ఏపుచ
నొక్క మహోక్షంబు నెక్కి చను
దెంచు వాని నొక్క దివ్యపురుషుం
గని వాని పన్పున వృషభ గోమయ
భక్షణంబు సేసి ... ఆది.
1.93.

**గోమాత** సం. వి. ఋ. స్త్రీ.
గోలోకమున ముఖ్యమైన గోవు.
వ. గోలోకంబున ముఖ్యంబులగు
గోమాతలంతయు నెఱుఁగు. అను.
3.80.

**గోమాయువు** సం. వి. ఉ పుం.
గోవులను పోఁదోలునది. జంబుకము,
నక్క.
వ. అనుటయు నాపగాంగనయుం డేక
త్రింశద్యోజనంబైన వ్యాఘ్ర గోమాయు
సంవాదంబను నితిహాసంబు గలవా
కర్ణింపుమని యిట్లనియె. శాంతి.3.53.

**గోము** దే. వి.
సౌకుమార్యము, మార్దవము.
సీ. .. బహుగుణంబైనను దానిఁ
బరికించి గోమునబ్బైఁ గంచప్రోక్షు
దేఱ. విరా. 1 101.

ఉం. గోమునఁ బెరిగిన వాఁడు మహా
మానోదగ్ర చిత్తుఁడప్పగుటను సం,
గ్రామంబున కలకండు,ధ్వామ ధుజా
పీర్య దుర్మద స్ఫురితుఁ డు.
ద్రోణ. 3 191.

**గోముఖము** సం. వి. అ. పుం. న.
వాద్య విశేషము.
వ. ... శంఖ భేరీ పణవ గోముఖ
ప్రముఖ తూర్యంబులు దిక్కులు
పిక్కటిల్లఁ జెలంగె. శల్య. 2.185.

**గోముఖుఁడు** సం. వి. అ. పుం.
క్రోధ గణాంబ సంభవుఁడు ఆది.
3.80.

**గోయజనము** సం.వి అ న. గోయజ్ఞము.
అను. 2.469.

**గోయజ్ఞము** సం. వి. అ. పుం.
గోవులను దానము చేయుట - గోయ
జనము.
ఉం. ... గోయజ్ఞములు సూని విధి
నడపె నింద్రుఁ డమలచరిత్రా. అను.
2.472

**గోరక్షకుఁడు** సం విణ (అ. క్షి.అ)
గోవులను రక్షించువాఁడు.
కం. విను కర్షకులును వణిజులు,
ననఘా గోరక్షకులు ధరాధిపునకున్,
ధన మొదఁగూర్చెడు చోటుల, ననేక
విధములకు నెల్ల నాధ్యస్థలములే.
శాంతి. 2.39 .

**గోరథము** సం. వి. అ. పుం.
ఒక పర్వతము, గిరివ్రజము చుట్టు
నున్న యైదు పర్వతములలో నొకటి.
ఉం. గోరథమును ఋషభము, వై
హారము ఋషిగిరియుఁజైత్యకాద్రియు
ననఁగా, భూరిరుతేసు ఠీరిం, శూర
ఘటులు వోలెఁగాచి చుట్టును నుండున్.
వ. దాననచేసి యిప్పురంబు గిరివ్ర
జంబు నాఁ బరఁగె. సభా. 1.174,
175.

**గోరసము** సం. వి. అ పుం.
ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి.
వ. ..సహదేవుండు గోవులం జూచి
భూవల్లభుండు సంరక్షించిన సమయం
బున సముపార్జితంబులగు పదార్థంబు
లన్నియు నన్నుల వశంబు సేయుచు
వారంపు గోరసంబులు మెప్పి సలుపు
చుండు. విరా. 2 2, అను. 5.55.

**గోరు** దే. వి. ఔ. ఇది 'గీఱు' అను
ధాతువునుండి యేర్పడి యుండ
వచ్చునేమో గాని సంస్కృత 'ఖుర'
శబ్దము నుండిగాని, ప్రాకృత 'ఖోరు'
శబ్దము నుండిగాని పుట్టెనని చెప్పుట
సంస్కృతమునకలి మిథ్యాభ్రమ
యుండవచ్చును.
బహు. గోళ్లు, గోళ్ళు, గోర్లు.
నఖము.
ఆ. గురుని మాట సరకుగొనమి దుర్యో
ధను పిట్ట పుడప గోరు పిసుకఁ
బ్రింపఁ గఱవ మరగు టుడియ కాలా
స్తమయ సమయముల భానుఁ జూచు
చాయుపరచు. అను 4.90
సీ. గోరఁ బోఁజినమాత్రఁ గొన్నిఁ యచి
ఱక్కఁ సొంపుగా ద్రవ్యల వాపి
పాపి. విరా 4 35.
మ. పెలుచన్ గోళుల నొత్తి యగ్గ
జముఁ దాఁజేలన్ పసుపు మూర్ఛం
బొందెన్ వెసనెత్తి అను. 1.235.

స్కందాపస్మారము (చూ. బాలగ్రహములు) ఆర. 5.252.

4. పదాఱేండ్ల పిదప మనుజులను వేధించు గ్రహములు.

1) దేవగ్రహము :- నిద్రించు సమయమునఁగాని మేల్కొని యున్న సమయమునఁగాని మానవుని బట్టి భ్రమసిన పలుకులు పలికించునది. 2) పితృగ్రహము :- పరుండి యున్నప్పుడుగాని కూర్చుండి యున్నప్పుడుగాని పితరులను జూచి యున్మదించునటుల జేయునది. 3) గంధర్వగ్రహము :- భ్రాంతినొంది గంధర్వులను జూచునట్లు చేయునది.

4) యక్షగ్రహము:- అప్పుడప్పుడు ప్రవేశించి భ్రమియింపఁ జేయునది. 5) వికృత గ్రహము ;- వాతపిత్తాదులచే బుద్ధి చెడి యేర్పడునది. ఆర. 5.253.

5. మొసలి.

మ. ... మహాగ్రాహి గ్రహోత్యుగ్రదంష్ట్రనమై పేర్చు పయోధి దాటితి జనాశ్చర్యైక సంపాదినై. ... ఆర. 7.25.

6. అధ్యాత్మయాత్ముఁడైన విష్ణుని నామములలో నొకటి. శాంతి. 3.110.

**గ్రహించు** సం. స. క్రి.

1. పట్టుకొను, స్వాధీనము చేసికొను.

వ. ..అతనిపయి నెత్తివోయి తదీయ గోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నష్టపడం బఱతెంతురు. విరా. 3.117.

2. చేతితోఁ బట్టుకొను (పాణిగ్రహణముచేయు).

తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు తెఱఁగు దోఁపఁ గెంపారెడు తీఁగబోఁడి, మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్ర,హించెఁ బల్లవాలంబి మత్తేభలీల

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. విరా. 5.399,400.

3. తెలిసికొను, అభ్యసించు.

కం. శ్రౌత స్మార్త నిమిత్త, జ్యోతిర్విద్యలు గ్రహించి యోగ్యసమయ సం, జాత ప్రాగల్భ్యుఁడనై, చాతుర్యము మెఱసి మానసంబలరింతున్. విరా. 1.70. (పాఠాం.) (వహించి పాఠము)

4. సహించు.

చం. ప్రతిబల దర్పభంజనుఁడు పార్థుఁడు దారుణ బాణవర్షము, న్నతి నతివీరుఁడై కురిసినం బరముండు మహాంబువృష్టిఁ బ,ర్వతము గ్రహించినట్లు బలవంతుఁడు దాని గ్రహించి ఘోర న,క్షత తనుఁడయ్యె వాని నతి గర్వితుఁ బార్థుఁడు సూచి యాత్మలోన్. ఆర. 1.311; చూ. ఆర. 1.312.

**గ్రహోపఘాతము** సం. వి. అ. పుం. (గ్రహ + ఉపఘాతము).

గ్రహముల వలని బాధ.

కం. విను డెబ్బదియేండ్లగు దాఁ,కను మానవులకు గ్రహోపఘాతంబులు గ,ల్గు ననంతరంబ గ్రహముల, వని వలవదు ముదిమి యెల్ల పనులకుఁ జాలున్. ఆర. 5.254. శ్లో. యావత్ సప్తతి వర్షాణి భవంత్యేతే గ్రహాస్తృణాన్, అతఃపరం దేహినాం తు

గ్రహపర్యో భవేజ్జ్వరః. సం. భార ఆన. 230.58. (మూలములో జ్వరః అని యుండఁగా ఎఱ్ఱన 'ముదిమి' అని మార్చుటం బట్టి ఎఱ్ఱన భారతము వ్రాయునాఁటికి వెట్టుదినాఁటి ముదిమిబాధ వచ్చుచుండెనేమో.)

## గ్రా

**గ్రామణి** సం. విణ. (ఇ. పు ఇ).
ముఖ్యుఁడు
ఉ. భీముఁడు వగ్ర దర్పమున నీవ్వు నిపైఁ జన సిద్ధమై కురుగ్రామణి ఫల్గునంచక యుగంబున నాఁటెను మేను నించుచున్. భీష్మ. 2.309, ఎఱ్ఱ. 1.146.

**గ్రామణీయుఁడు** సం. విణ.(అ.ఆ అ).
గ్రామవాసి.
వ. ... పుష్కరారణ్య నివాసులైన యాభీర గణంబులను సరస్వతీ సింధు మూలాశ్రితులైన గ్రామణీయులను పంచనదాంతర పర్వత నివాసులను వశంగతులం జేసెను. సభా 1.266.

**గ్రామము** సం. వి. అ. పుం.
1. ఊరు.
సీ. ఉపనిష్క్రమణయాస్తమయ కాలములఁ నిద్రఁ బొందుటయును . గ్రామంబు సెఱుచుటయును పాపంబులందురు బుధజనములు. శాంతి. 1.293; ఆది. 3 221.
2. (శబ్దాదిపూర్వకమైనపుడు) సమూహము.
ఇంద్రియ గ్రామము శాంతి. 4. 364, భూత గ్రామము. శాంతి. 4 90; షడ్జ గ్రామము స్త్రీ. 2.1.
3 ప్రదేశము, స్థలము.
మాలిని - [illegible] గ్రామ పద్మావళీ సం,గమ సుభగ పదాబ్జా. విరా. 1.335.

**గ్రామ్యము** సం విణ. (అ ఆ అ).
గ్రామభవము.
1. ఊరియందుఁ బుట్టినది.
వ ... వనములనుండి గ్రామ్య వస్తువుల [illegible] 3 221.
2. అసభ్యము, అశ్లీలము.
మ. మతిరక్తుండై [illegible] యుండును యున్మత్త [illegible],గదవస్త్రుఁడును ముక్తకేశుఁడు బహుగ్రామ్యోక్తి [illegible] హితపుణ్యుఁడు మునీశ్వరుండు [illegible] యేచెంచె దుర్వాసుఁడన్ మతి యమ్మొగ్గలు పాలికిన్. అను. 6.116.

**గ్రామ్యోక్తి** సం. వి ఇ. స్త్రీ.
అసభ్యపు మాట.
(చూ. గ్రామ్యము రెండవ అర్థము)

**గ్రావము** సం. వి. న పుం.
కొండ, ఱాయి.
ఉ ... భూరి భూరుహ,గ్రావ నఖాయుధుల్ ... వాలి సుగ్రీవులు దాఁటి రౌఁటాటమున. అర. 6.380.

**గ్రావస్తుతుఁడు** సం. వి. అ. పుం.
ఒక మహర్షి. ధర్మజుని రాజసూయమున సుబ్రహ్మణ్యుఁడుగా నున్న వాఁడు. సభా. 1.292.

**గ్రాసము** సం. వి అ పుం.
తిండి, ఆహారము.
వ. ... [illegible]

గ్రాసంబులుఁ గొనక ధనంబులు కోడం
బట్టుచ్పలకుఁ బెట్టుమండు. విరా
272.

తే. గ్రాస మాచ్ఛాదనంబు దక్కంగ
నెవ్వఁ,వర్థి కొసంగి యిచ్చిన నంబి
అశ్వ. 2. 172.

శా. . సిరి నాకేలకొ నే గ్రాసవా,సో
దైన్యంబులు వచ్చు నాయుదయ నీ
దృష్టాంతకున్. ఉద్యో. 3.12.

**గ్రాహిణి** సం. వి. ఈ. స్త్రీ.
గ్రహించునది (పెండకొనునది).
వ. ... అష్టసంపత్ప్రదాయిని ధవ
ళచ్ఛాయాంబున మదీయ మతి యుది
వచ్చియు హృద్గ్రాహిణియు నయి
యున్నయది. అశ్వ. 2.103.

**గ్రాహ్యత్వము** సం. వి. అ. న.
ఎఱుక.
చం. గుణమూర్తి మాయ దానిని,గణు
లందెవరన్నఁ బెగడు గ్రాహ్యత్వం
బున్,గణములు చెడిపోవంగా,గుణా
ధీనమగు వెలుఁగుఁ గను దాన ననన్.
శాంతి. 4.191.

**గ్రాహ్యము** సం. విణ. (అ. ఆ. అ.).
గ్రహింపఁదగినది, గ్రహణీయము.
వ. . . సకల లోక గ్రాహ్య వచనుం
డగు నమ్మహాముని యిట్లు సెప్పం
దెలివొందకయున్న ధర్మనందనుం
డనుంగాని పురందరనందనుండు
శాంతి 1.182, శాంతి. 4.121,
శాంతి 4.283

# గ్రి

**గ్రీవము** సం. వి. ఆ. స్త్రీ.
మెడ, కంధరము.
సీ. హ్రస్వ దీన గ్రీవ నవనతాయత
హను పతితపల స్ఫిచావాభిరాము.
అర. 3.319

**గ్రీష్మము** సం. వి. అ. పుం.
వేసవి, ఎండకాలము.
శా. ... దుర్యోధన, గ్రీష్మాదిత్య
పటుప్రతాప విస్ఫూర్తంబు విరా
4.52, భీష్మ. 2.278.

# గ్రు

**గ్రుచ్చిపట్టు** దే. స. క్రి.
పెంపలకుండి దూర్చి గాఢముగా ఒత్తి
పట్టు.
వ. అనునట్టియెడ నర్జునుండు రయం
బున రథంబు డగ్గఱికి వఱచి పురు
షోత్తము పిఱుందిదెసం గ్రుచ్చిపట్టిన
నతండు దీర్ఘబాహుండగు నతని
నాయతశాఖంబగు విపులశాఖిం గొని
పోవు మహావాతంబునుం బోలెఁ గొని
పోవ నాతండు పది యడుగుల
కొలఁది నిరాఘాటంబు చక్కం ద్రొక్కి
యానిగిలంబడి నిలువంబట్టి నిల్చెను.
భీష్మ. 2.159.

**గ్రుచ్చియెత్తు** దే. స. క్రి.
1. చేతులు చంకలలోనుంచ దూర్చి
పైకి లేవనెత్తు
కం. కర్ణుండు మద్రమహీ,పతి
గ్రక్కున గ్రుచ్చియెత్తి పాయలగొని
యుద్ధతి వాయఁ జనిరి మారుతుఁ
సుతుఁడాలోఁ దెలిసి లేచి బొబ్బిడెఁ
గడున్. ద్రోణ. 1.190.

వ. .... అతి నిశిత దంష్ట్రా కరాళం బైన తన వదన గహ్వరంబుఁ దెఱచి గ్రుడ్లు మెఱవ .. గర్జిల్లుచున్న వాని... ఆర. 1.107.

సీ. కుఱుచ చేతులు మిడిగ్రుడ్లును గడుగొన్న తఱటులు మఱి చెంచుఁ డలలు నమర.....ఆర. 1.300.

2. పక్ష్యాదుల యండము.

తే....అంత నుడయమయ్యె నవ్వేయి గ్రుడ్డుల నధిక బలముఁ దేజమును గల్గి యా సర్పరాజి... అను. 1.167.

**గ్రువ్వ** దే. వి. గువ్వ.

అడవి పావురము.

గీ. గ్రువ్వ గద్ద దివ్వారుపుఁ బువ్వు గూట, యిల్లు సొచ్చిన శాంతి సేయింప వలయు. అను. 4.119.

**ఆ.** ఫలము నినుము వెండిఁ బసిఁడి ముచ్చిలికొన్నఁ, గ్రోఁతి వాయసంబు గ్రువ్వ నీచ, కృమియు నగు. అను. 4.266.

## గ్రౌ

**గ్రౌచ్చు** దే. స. క్రి. (√ గ్రొయ్యు. వ్రాఁతయందిది పరుషాదిగాను గానఁ బడుచున్నది. అని. శ. ర.)

గుద్దలి లోనగువానితో పల్లము చేయు, గుంట త్రవ్వు.

చం. ... బం డనిన సపుత్ర మిత్ర ముగ నద్దెస నందఱు గ్రౌచ్చి పాఁతు దున్. ఉద్యో. 3.142.

వ. అంత నా క్షతియులొక్క భార్గ వుని యిల్లు గ్రౌచ్చి యనంతంబయిన యర్థంబుం గని. ఆది. 7.133.

ఉ. .. నూయి గ్రౌచ్చి నీర్వావిరి గన్నయట్టులు శివంబగు తత్త్వము గాంచు నెమ్మెయిన్. అను. 3.316.

శ్లో॥ యథా ఖనత్ఖనిత్రేణ జాంగలే వారి విందతి, అనిర్వేదాత్తతః స్థాన మీప్సితం ప్రతిపద్యతే॥ సం. భార. అను. 152.3. (నిర్ణయ).

**గ్రౌప్పించు** దే. స. క్రి.

త్రవ్వించు.

వ. అప్పుడప్పట్ట గ్రౌప్పించిన నలిగి నిమీలత నయనుండై చ్యవనుఁడు సంయాతి సైన్యంబులకెల్ల మూత్ర పురీష నిరోధంబుఁ జేసిన. ... ఆర. 3.178.

**గ్రొయ్యు** దే. అ. క్రి.

గీ. అమ్మహాత్ముఁడు .... ఇచ్చు, గోగణంబుల గొరిజల గ్రొస్సి యయ్యెఁ గాదె యీ సరోవరము జగన్నుత ముగ. ఆర. 4.368.

## గ్రో

**గ్రోఁకు** దే. స. క్రి.

గీఁకు, బరుకు.

తే. ... శిరము గ్రోఁకంగఁ దగదిరు సేఁత. అను. 4.102.

('గోఁకు'-అని సూ. ఆ.ని. పాఠము).

శ్లో॥ న సంహతాభ్యాం పాణిభ్యాం కండూయేదాత్మనః శిరః. సం. భార. అను. 161.73. (నిర్ణయ).

## గ్లా

**గ్లాని** సం. వి. ఇ. స్త్రీ.

(శ్రమము, మనస్తాపము, క్షుత్పిపాసలు

మొదలగు వానిచేఁ గలిగిన) దౌర్బల్యము.

వ. ... (ధృతరాష్ట్రుఁడు) విదుర కృప సంజయుల నుద్దేశించి తనకు ముఖశోషయుం దను గ్లానియుం గలిమి నుగ్గడించి. ఆశ్ర. 1.39.

# ఘం

**ఘంట** సం. వి. ఆ. స్త్రీ.
గంట.
మ. ... ఘంటా నినాదా త్త ఘో,షణ నానా పటు బృంహితధ్వనియు. విరా. 3. 159.

**ఘంటాకర్ణుఁడు** సం. వి. అ. పుం.
వ. .... తన యనుచరుఁడైన యిత నిని శివుఁడు కుమారస్వామికి అను చరుఁడుగా నిచ్చెను. 2.183.

**ఘంటిక** సం. వి. ఆ. స్త్రీ.
1. చిఱుగంట.
చం. ... కరీంద్ర ఘంటికా,ఖ్యుదిత నినాదము. విరా. 5.39.
ఉ. ...ఘంటికా స్వనో. పేతముగాఁగ వాఁడెలమిఁ బెద్ద యెలుంగునఁ జాటె నెల్లెడన్. మౌస. 1.24.

**ఘట** సం. వి. ఆ. స్త్రీ.
ఏనుఁగుల సమూహము, సమూహము.
సీ. ... ఉభయ పార్శ్వంబుల నిభ ఘటలేలకో చనుదేవు సమదాళి సమితి మొరయ. విరా. 1.186.

**ఘటకుఁడు** సం. విఱ. (అ. టికా. అ).
ఘటిల్లఁ జేయువాఁడు,
కం. ... సమంచితానల సంస్కా,ర దశా పూతత్వము నా, విదితయశుఁ డొనర్చె విప్రవితతి ఘటకుఁడై. మౌస. 1.152.

**ఘటజానకుఁడు** సం. వి. అ. పుం.
ఒక మహర్షి. ధర్మరాజు సభకొకపరి వచ్చినవారిలో నొకఁడు. సభా.1.21.

**ఘటన** సం. వి. ఆ. స్త్రీ.
ఘటనము, చేయుట.
చం. ... నితాంత దంత రటదాస్య రంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృ త్త న,ర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణా పరిణద్ధ మూ ర్తియై. విరా. 2.133; విరా. 3.77.
2. కృత్యము, యోగము, కూర్పు.
తే. ... గడవరాని, దైవఘటనకు నొత్తుఁ జిత్తంబులోన. విరా. 2.208.

**ఘటనము** సం. వి. అ. న. ఘటన.
కూర్పు, యోగము, కృత్యము.
కం...అ,ప్పలుకులకు నసత్యత్వము, గలుగఁగ నేర్చునొకో దైవఘటన బలమునన్. శల్య. 1.263

**ఘటపృష్ఠము** సం. వి. అ. న.
జాన యడుగు భాగము, బొచ్చె.
తే. స్థావరములుఁ దన్నుఁ గలయ, విలయ మొందిన ఘటపృష్ఠ విధము దాల్చు. శాంతి. 5.74.

**ఘటము** సం. వి. అ. పుం.
1. కుండ, కడవ.
సీ. ... తనదు శుక్లము నిర్గమించిన ఘట సురక్షి,తము సేయ స ప్తభేదము లొంది యది సత్పురుషులైరి. శల్య. 2.160.
కం. వినుము ఘటము సేయుట సాధ నములు లేకున్న నగునె. శాంతి. 5.368.

2. కాన.
చూ. ఘటపృష్ఠము

**ఘటశుద్ధి** సం. వి. ఇ. స్త్రీ.
భాండములను శుద్ధిచేయుట.
సీ. ... ఇలువడి ఘటశుద్ధి గలిగిన కాంతలందు. తే. నిల్చు. అను 1.285.

**ఘటి(యి)ంచు** సం. స. క్రి
1. చేయు, కావించు.
కం. జనకుండు వేడుకఁ జేసాఁచిన యంతన సంతసిల్లి చేతం బిండం, బనుమానింపక యేఁ, బెట్టిన శాస్త్ర విధానగతి ఘటింపమి వచ్చున్. అను 3.129.
వ. అక్రాంత ... అంజలి ఘటించి యవ్విరించి కిట్లనియె. ద్రోణ. 2.167
2. సమకూర్చు, నెఱవేర్చు.
తే. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి, పోసి చేసి చైతన్య సంపుటము దగ ఘటించిరో కాక యిట్టి చేడియలు గలరె. విరా. 2.27.
3. ఆయత్తపఱచు, సిద్ధముచేయు
చం.... ఘటింపఁగఁ బంపు రథంబు చయ్యనన్. విరా. 3.150.
4. మోపు, ఆరోపించు.
ఉ. ... అన్నపైఁ, తప్పు ఘటించి నీవు నొక తాలిమి గల్గినవాఁడవై నెపం బొప్పినఁ జెల్లె నీదు నిలు పోపును జూతముగాక యిచ్చుటన్. విరా 5.93.
5. ఏర్పఱచు, కూర్చు.
చం. ... అట్టిదియును ధర్మవే తగ ఘటించిన నిక్కము లేదయేని. ఉద్యో. 2.70.
వ. .... లలాటంబుల నంజలి పుటంబులు ఘటించి. ద్రోణ. 2.363; విరా. 1.13.
6. జరిపించు.
సీ. ... కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁడగు ధర్మసుతు సిరి యపహరించి. కర్ణ. 3.356.
7. కల్పించు.
సీ. .... అచ్చోటి మాటలవి కొన్ని ఘటియించి చెప్పి. మౌస. 176,
8. నిర్మించు, పన్ను.
ఉ. ... వైరిదృష్టులకు భీకరమై చనుఁ గ్రౌంచరూపకం, బెల్లి ఘటింపు నీదు వెరవేర్పడ నమ్మెన యద్భుతంబుగన్. భీష్మ 2.20.
9. పొందు, సిద్ధింపఁజేయు.
సీ. ... అర్థముల్ దుర్బుద్ధికైనను సిద్ధించు నగుకాలమున నార్యులయ్యుఁ గాని ఆ – కాలమున ఘటింపఁగాఁ నేరరు. శాంతి 1.185.
కం. వెండియు ధనార్జనంబులు, గొండలవలనను ఘటించుకొనునను. భీష్మ. 1.37.
10. చెప్పు.
తే. వ్యాస మునినాథు షట్సహస్రోర్వర్తి ధర్మ నాగమ వ్యాస కర్మరు నమిత తేజుఁ, గొలిచి తత్ప్రసాదంబున వలను దెంపుఁ గలిగి యేను నారాయణుకథ ఘటింతు. శాంతి. 6.346
11. సంపాదించు.

చం. .... భోగపరుండు గావునన్,
ధనము ఘటింపఁగాఁ దగు విధంబని
చూచి. శాంతి. 3.472.

అ. క్రి.
సంభవించు, జరుగు.

కం. మొదల విధినియతియును న,ట్టిద
యందుదు పెద్దలది ఘటింపంపో దే,
మదిఁ జూచి చెప్పినను, ద,ప్పదు
మేరువు దరిగేనేని బాంచాలసుతా.
ఉద్యో. 3 123.

**ఘటిక** సం. వి. అ. స్త్రీ
గడియ, అఱువది విగడియల కాలము
ఇది ఇరువదినాలుగు నిమిషముల
కాలము, $2\frac{1}{2}$ గడియలు ఒక గంటలేక
60 నిమిషములు.

సీ. ... అమ్మని నెడనాడి,యుండర్థి
తుండయ్యె నపర ఘటిక. అను.
2 308.

**ఘటితము** సం. విణ. (అ. ఆ. అ).
యోజితము, కూర్పఁబడినది.

వ... భీమసేనుండు ఘటిత కాంచన
బిందు సందోహ సుందరంబును పృథ
విశాలంబును నగు పంకయుం ..
బుచ్చుకొని. భీష్మ. 2 64.

వ. ... విస్ఫురద్వాలంబుఁ గివాటి
ఘటితంబని చొంనొల్లక వాటఘటి
తంబు విస్మయంబుగా వగచి చొరం
బోయి తత్కవాటస్ఫటికలా ఘట్టిత
లలాటుండనైన నన్నుం జూచి ...
ద్రౌపది న. ... సభా. 2.140

**ఘటిల్లు** సం. అ క్రి.
ఘటించు

సీ. ... భూతంబుల యందెల్ల దయ
ఘటిల్లు. శాంతి. 5.228; శాంతి.
6.145.

**ఘటోత్కచుఁడు** సం. వి. అ. పుం.
భీమునకు హిడింబయందుఁ బుట్టిన
వాఁడు. ఆది. 6.232.
(చూ.చివరి సంపుటము అనుబంధము)

**ఘటోదరుఁడు** సం. వి. అ. పుం.
వరుణుని సేవించు దానవులలో
ఒక్కఁడు. సభా. 1.72.

**ఘట్టన** సం. వి. అ. స్త్రీ.
1. సంఘర్షణ, ఒరపిడి, రాపు.
చం. కరితురగాది ఘట్టనయు గాలియు
నొంపదె యొంటియున్న య,త్తరువు
ఉద్యో. 2 88.
2 హతి, వ్రేటు.
తే. బాణఘట్టనఁ గంగటఁ బడి
పెనంగ. ద్రోణ. 4.117.

**ఘట్టనము** సం. వి. అ. న. ఘట్టన.
1 సంఘర్షణము, ఒరయుట, రాపిడి.
మ, గుణరావంబుఁ గృపాణ ఘట్టన
రవ ఘోషంబునున్. విరా. 3.160.
2 తాఁకుడు, త్రొక్కుడు.
వ. .... తురంగ రథ నేమి గజ
పద ఘట్టనంబుల నిల గ్రక్కదలం.
ద్రోణ. 5 342.
3. హతి, వ్రేటు.
వ. ... కౌంతేయ సైన్య సంతానంబు
నానాస్త్ర ఘట్టనంబుల విఘటితంబు
సేయుచున్న నవ్వాయునందను నడచు
నుండు. ద్రోణ 5.225.

**ఘట్టము** సం. వి అ పుం.
సన్నివేశము.

ఆ. ఎట్టి ఘట్టములను నెట్టి యాపద
లను,నెట్టి తీఱములను ముట్టఁబడిన,
వంతలెల్లఁ బాయ నింతులఁ బ్రజలను,
నొనరఁ జూడఁగనిన జనుల కెందు.
ఆది. 4.84.

**ఘట్టితము** సం. విశే. (అ. ఆ. అ).
కొట్టఁబడినది.
వ. ... లలాట ఘట్టిత గృహద్వారుం
డయి. సభా. 2.86.
మ. .... గాంధారేశు వీతధ్వజున్,
విరథున్ విస్ఫురితాస్త్ర ఘట్టితునిఁ
గావింపన్. ద్రోణ. 1.160.

**ఘనత** సం. వి. ఆ. స్త్రీ.
గొప్పతనము.
ఆ. ఒలసి లోభ మోహములు దోష
సంసేవ,నం బొనర్పఁగా ఘనత్వగాధ
యగు నవిద్య భూమియై బహు కర్మ
బీజముల కంకురాది శక్తులొసఁగు.
శాంతి. 4.344.

**ఘనపథము** సం. వి. అ. పుం.
మేఘమార్గము, ఆకాశము.
కం... ఘనపథ మఖిలంబుఁ దూఁటు
కట్టెడు తూర్య స్వనములును. భీష్మ.
1.236.
చం. ... సింహనాదము,ల్ఘన పథమెల్ల
నిండఁగ. మౌస. 52.

**ఘనము** సం. విశే. (అ. ఆ. అ).
1. దృఢమైనది, గట్టిది
వ. .. నిద్రితుండైన భీమసేను నతి
ఘన లతా పాశ బద్ధుఁ జేసి గంగ
మడువునం ద్రోచిన. ఆది. 3.13.
సీ...పొదవును ఘనమును నగు కోట
గలిగి శాంతి. 2.383.

2. గొప్పది.
మ. .. చతుస్సారాశి మధ్యంబునన్
ఘన బాహాబలమొప్ప నన్ను నెదు
రంగా నొక్కఁడున్ లేమి యె,వ్వనికిం
దెల్లముగాదె. విరా. 2.75.
3. అధికమైనది.
మ. ... త్రిదశేంద్ర సూనుఁడు ...
ఘన శాతోజ్జ్వల దుర్నివార విలసత్
కాండంబులన్ ద్రోణు వాహన సూత
ధ్వజ దేహముల్ వొదివె. విరా.
5.137.
వి. అ. పుం.
1. మేఘము, మబ్బు.
చం. .... ఘనపంక్తులు లేని వియత్త
లంబు. శాంతి. 6.119.
ఉ. .. ఘన ప్రకారంబును బోలెఁ
గాఱుకొంచు. విరా. 5.69.

**ఘనసమయము** సం. వి. అ. పుం.
మేఘముల కాలము, వర్షఋతువు.
వ. ఆ వనచరుండు రామునకుఁ
గృతాంజలియై దేవా యీ ఘర్మసమయ
శేషంబును ఘనసమయంబునుం గడపి
మఱి సీతాన్వేషణంబునకు నుత్సహిం
చుట లెస్స. అర. 6.387.

**ఘనసారము** సం. వి. అ. పుం.
1. కర్పూరపు చెట్టు.
చం. సరళ తమాల .... ఘనసార
మహీరుహ రాజ రాజి సుం,దర నవ
నందనావళుల. ఆది. 8.78.
2. కర్పూరము.
చం. నల దమయంతులిద్దఱు .... సలి
పిరి దీర్ఘ వాసర నిశల్ ఘనసార
పాంసులం,దలిరుల శయ్యలన్. అర.
2.24.

3. శ్రేష్ఠమైన మేఘము (విశేషణోత్తరపదము).

ఉ. భూరి తపోవిశేష పరిపూర మృదుస్థిర హృత్కరండ వి,స్తార నివాస తంత్ర ఘన సార విధా పరమాభిరామ రే,ఖా రమణీయ ఘనసారము =(విష్ణు పరమున) శ్రేష్ఠమైన మేఘము; (శివ పరమున) కర్పూరము.

**ఘనాంతావసరము** సం. వి. అ. పుం. (ఘన + అంత + అవసరము).

మేఘములు చివరి కాలము; శరత్కాలము.

కం.... జేవీసహితంబుగఁ బ్రభుఁ వరుఁ డవ్వనమునందు విహరించె ఘనాం, తావసర వాసరంబుల. అర. 4.327.

**ఘనాఘనము** సం. వి. అ. పుం.

వర్షాకాలము, వానకారు.

వర్షుక మేఘము, కురియు మేఘము.

కం. చని ఖాండవంబుఁ గాల్పఁగ, మొనసి మహాహస్తి యూథముల, బోని ఘనా, ఘనములచే బాధితుఁ డయి,వనజుకచ కరిగి హవ్యవాహనుఁడనియెన్. ఆది. 8.249.

**ఘనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

గొప్పవాఁడు, అధికుఁడు.

సీ. .. కర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁడగునొక్కొ,యను ఘనంబుల సందియంబు మాన్ప. విరా. 4 205.

ఆ. ... అనుపమానతేజు ఘనుఁ గుమారుఁ గని. 7.350.

తరువోజ... కౌరవజ్యేష్ఠుండు ఘనుఁ డిట్టులనియె. ఆది. 6.129.

(ఇక్కడ దృఢమైనవాఁడు, గట్టివాఁడు, ఒక పట్టుపలయే నెగ్గవలయు ననువాఁడు-అని భావము).

**ఘర్మజలము** సం. వి అ న.

చెమటనీరు, చెమట (చూ. ఘర్మము).

**ఘర్మము** సం. వి. అ. పుం.

చెమట.

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దనువుద్గత ఘర్మజలంబు దాల్చుచున్. విరా. 2.91; శాంతి. 5.439.

2. వేసవికాలము.

వ. అట్టి ఘర్మదివసంబులు సహింపనోపకెద్దునుం డొక్కనాఁడు కృష్ణుననట్లనియె ఆది. 8 230.

**ఘర్మసమయము** సం. వి. అ పుం.

వేసవికాలము (చూ. ఘన సమయము, ఉదా.)

**ఘస్మరుఁడు** సం. విణ. (అ. ఆ. అ).

చంపినవాఁడు.

చం. కనుఁగొని పల్గుపంపు ముసఘస్మర ... ద్రోణ 1.356.

## ఘా

**ఘాతకుఁడు** సం. విణ. (అ. ఆ. అ).

చంపువాఁడు, హింసించువాఁడు.

సీ. ... పొలియుదు రన్యోన్య ఘాతకులై భవత్ జ్ఞాతిజనులు. స్త్రీ.2.161.

**ఘాతము** సం. వి. అ. పుం.

1. దెబ్బ, వ్రేటు, ప్రహారము.

వ. ... బకావరజుండు దస్సినం బవమానపౌత్రుండు పదవైచి తాను మీఁదై జాను కూర్పర ముష్టి ఘాతంబులు నిర్ఘాత పాతంబులు బోలెఁ బ్రయోగించి నొప్పించి. ద్రోణ. 3.268.

2 చంపుట, సంహారము.

వ... భృగు వంశజుండైన రురుఁడు గావించు సర్పఘాతంబు సహస్ర పాదుఁ డుడిగించినట్లు. ఆది.1.128.

సీ. పూతనాఘాతంబుఁ జేటనేతరమైన శకటభంజన త్రోపును. సభా. 2 41.

**ఘాతి** / **ఘాతిని** } సం. విణ. (న్. నీ. న్.)

చంపినవాఁడు, చంపినది. (వృత్తి యందు కర్మవాచకము పూర్వపదముగా నున్నపుడే ఈ రూపమగును).

ఉ. .. సోదర ఘాతినైన నిప్పటి దుష్ట మనంబునం బెఱుగు శోకము నెట్లు సహింతు...శాంతి. 1 14.

కం. బంధుఘాతిఁ బర ధనహరణ పరునిఁ జంపి పుణ్యుఁడగు నృపుఁ డనఘా. శాంతి. 1.95; అను. 5.105.

కం. పడయఁగరాని కొడుకులఁ, గడుఁ బలువురఁ బడసి పుత్రఘాతిని వైతి. ఆది. 4.152.

2. నాశనము చేయునది, హరించునది.

తే. అధిప సర్వాస్త్ర ఘాతియై యతఁ డుల్లు, నస్త్రమునఁ జిత్రముగఁ దెగ యండఁ దునిమె. ద్రోణ. 3.205.

3. కొట్టువాఁడు, నలియఁగొట్టువాఁడు.

తే. ...గోవు, ముక్కు గుద్దెడువాఁడు వన్మృష్క ఘాతి, యగు నతండు నధోగతి కరుగువాఁడు. అను. 2 62.

వి ఇ. పుం.

దెబ్బ, పోటు.

చం. ఉఱఁడు సురేంద్రుడైన ...యుండు హిడింబుఁడు వాని ఘాతికిన్ వెఱవనివారలుం గలరె. ఆది. 6.195.

**ఘాతుకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఘాతకుఁడు.

చంపువాఁడు, హింసించువాఁడు.

సీ. ... పౌలియుదు రన్యోన్య ఘాతుకులై భవద్జ్ఞాతిజనులు. స్త్రీ. 2.160. (సం. ము. పాఠము)

**ఘాసము** సం. వి. అ. పుం.

లేఁత పచ్చిక.

ఉ. ... వెల్వడియె శైల విశాల గుహాలినుండి నాగంబుల యూధముల్ సరస ఘాస పరిగ్రహణోత్సుకంబులై. ఆది 6 175.

# ఘూ

**ఘూకము** సం. వి. అ. పుం.

'ఘూ' అని ధ్వని చేయునది, గుడ్లగూబ.

తే. ... కనియె .. కాకి ఘూకా రవ స్ఫూర్తి . . మీ తరుచక్రవర్తి. విరా. 1.162.

**ఘూత్కారము** సం. వి అ పుం.

'ఘూ' అను ధ్వని, ధ్వని.

కం ...ధార్తరాష్ట్రి వీరుల శయ్యా, గారముల నెగసె నెంతయు, ఘోరంబుగఁ గాక ఘూక ఘూత్కారంబుల్. సభా. 2.253.

**ఘూర్జరము** సం వి. అ. పుం.

ఒకానొక దేశము. గుజరాతిదేశము భీష్మ. 1.40

**ఘూర్జరుఁడు** సం. వి. అ. పుం.

ఘూర్జరదేశ పురుషుఁడు, గుజరాతి వాఁడు.

వ. . . ఘూర్జరులు బ్రద్దపరుల నడి దంబులం . . . యుండుదురు శాంతి. 3.11.

**ఘూర్ణనము** సం. వి. అ. న.
భ్రమణము, తిరుగుడు.
మ. అవనీచక్రము . . .. అర్ణవముల్ ఘూర్ణన మొంద .. సూతునకు . . . జూపెఁన్. విరా. 2.284.
కం. ... ఘూర్ణనమొందని యర్ణవం బనఁగ. అశ్వ. 4.163.

**ఘూర్ణమానము** సం. విణ. (అ.ఆ.అ)
తిరుగుచున్నది, కల్లోలపడుచున్నది.
వ. ... ధర్మజుందమ్మెయికి సమ్మతించి బీభత్సు వీక్షించి ఘూర్ణమాన మానసుండగుచు. విరా. 1.84.
తే. మందరాచల చటుల విమర్దనమున ఘూర్ణమానమై గాఢ సంక్షోభ మెసఁగఁ దలఁకు జలనిధి నాఁ ద్రిగర్తక్షితిప, బలము దిరుగుడు వడియె సంకులము గాఁగ. విరా. 3.177

**ఘూర్ణము** సం విణ. (అ. ఆ. అ).
భ్రాంతము, తిరుగునది. కలఁగునది.
తే. .. ద్రోణుండు గుణరవ స్ఫురణ ఘూర్ణ,రోదసీ . . . గుచు మార్కొనఁ గడంగి. భీష్మ. 3.347.

**ఘూర్ణిక** సం. వి. ఆ. స్త్రీ.
దేవయాని పరిచారిక.
వ. ... దేవయానియు .. తన్ను రోయుచు వచ్చుదాని ఘూర్ణిక యను పరిచారికం గని. ఆది. 3.145.

**ఘూర్ణితము** సం. విణ (అ. ఆ. అ).
భ్రాంతము, తిరుగుడువడినది
ఉ. ... తలఁకి వాఁడు మహోన్నత ఘూర్ణితాకృతిన్ ద్రోణ 5.229.
తే అరుణములు ఘూర్ణితం . . . లైన లోచనంబులు మెఱయ. మౌస. 17
వ. .. . . . కోప ఘూర్ణిత బాష్పపూరిత నయననయై యున్న దేవయానిం గని యిట్లనియె. ఆది. 3.145.

**ఘూర్ణిల్లు** సం. అ. క్రి.
తిరుగుడువడు, సంక్షోభించు
మ... . . . ప్రపట్టనము పాతాళంబు ఘూర్ణిల్లె విరా 4 172.
వ. .. దాపటి కల్లు . . . దేప ఘూర్ణిల్లె కర్ణ. 3 342.
వ. ... పురంబు సముత్సాహ చం, ద్రోదయంబునకు మహార్ణవంబై ఘూర్ణిల్లుచుండె. ఉద్యో 4 136

## ఘృ

**ఘృణ** సం. వి. ఆ. స్త్రీ.
కనికరము, దయ.
కం. అవ్వసుధాధిపుఁడల్లని నవ్వొల యఁగ మాఱుకొనె ఘృణాకలితుండై శల్యా. 1.248.

**ఘృణి** సం. వి. ఇ. పుం. స్త్రీ.
కిరణము, వెలుఁగు.
తే. అతఁడు భూరి ప్రతాప మహా ప్రదీప, దూర విఘటిత గర్వాంధకార వైరి,వీర కోటీర మణి ఘృణి వేష్టితాంఘ్రితలుఁడు కేవల మర్త్యుఁడే ధర్మసుతుఁడు. విరా 2.191.

**ఘృతము** సం వి. అ. పుం. న.

ఆజ్యము, నెయ్యి.

కం. ... అది ఓోషత్రికి ఘృతంబు
నకు వెన్న క్రియ జనకం ... శాంతి
4.333.

**ఘృతాచి** సం. వి. ఈ. స్త్రీ.

ఒక అప్సరస్త్రీ కపిలా కశ్యపులకుఁ
బుట్టినది ఆది 3.65.

వ్యాసుఁడు ఒకప్పుడు అగ్నికార్య
పరుఁడై ... పుచ్చుకొని మథింపఁ
దొడఁగెను. ఆ సమయమున ...
ఘృతాచి యను నప్సరోవనిత లోచన
గోచరంబగుటచేఁ గామ గోచరత్వము
నొందెను. అతనిని వంచింపఁ దలఁచి
ఘృతాచి చిలుకయై యుండెను.
అప్సరో రూపాతిశయ సక్త చిత్తుం
డైన వ్యాసునకు శుక్రస్రావమై యరణి
యందుఁ బడియెను. అతఁడు నిర్వి
కంకంబగు నంతఃకరణముతో నరణి
మథించెను. ఆ యరణియందు శుకుఁడు
జనించెను. శాంతి. 6.250-251.

శ్లో॥ ఊర్వశీ మేనకా రంభా ఘృతాచీ
చ తిలోత్తమా, సుకేశీ మంజుఘో
షాద్యాః కథ్యంతేఽప్సరో బుధైః.

**ఘృతార్చి** సం. వి. స్. పుం.

విష్ణువు.

కం. ఘృత మర్చిస్సంపద యయి,
ఘృతార్చిరభిధాన మొందె. శాంతి.
6.435

## ఘో

**ఘోటకము** సం. వి. అ. పుం.

అశ్వము, గుఱ్ఱము

వ. .. ఆస్థానంబు సేరవచ్చి ఘోట
కంబుల నుపలక్షించుచున్న నన్నరేం
ద్రుండు గనుగొని. విరా. 1.257.

**ఘోటము** సం. వి. అ. పుం.

ఘోటకము, గుఱ్ఱము.

శా. ... ఘోట స్యందన వారణ
ప్రతతులం గూడన్ సతూర్యంబుగన్.
విరా. 5.242.

**ఘోణ** సం. వి. ఆ. స్త్రీ.

నాసిక, ముక్కు.

కం. ప్రాణాయామము క్రమమునఁ
బ్రాణోత్పీడనముగాని భంగి నడుపు
చున్, ఘోణాగ్రస్థితి విషయశ్రేణి
దొలఁగియుండి యోగసిద్ధుఁ బడ
యున్. శాంతి. 6.113.

**ఘోరము** సం. విశ. (అ. ఆ. అ.)

భయంకరము

సీ. ... ఘోర గృధ్రము సుకుమార
నాగాంగనఁ, బటుగతి నొడియంగ
బాలుకరణి. విరా. 2.128.

వి. అ. న.

దారుణము, భయానకము, దురా
గతము.

కం. తగుఁ బగదీర్చుట యిమ్మెఁ,
బగవగనే నెత్తురెత్తి త్రావుట
భీముండు గడున్ ఘోరము సేసెనుఁ
మగల కతిక్షుద్ర వృత్తమా పొగ
డొసఁగున్. స్త్రీ. 2. 63.

**ఘోషము** సం. వి. అ. న.

1. ధ్వని.

సీ. ... రథ ఘోషమునఁ బ్రతిరవ
మిచ్చు నద్రుల భయమున వావోవు